ఓమ్.

శ్రీమద్గురుభ్యోనమః.

శ్రీవరప్పుకోట తా॥ వసంతగ్రామనివాసియు

భక్తజన సౌరక్షణేయు

నగు,

శ్రీ

# పోలమాంబాస్తోత్రదండకము

ఇది,

పొడుగు రామబ్రహ్మయ్యయు

నిచే రచియింపబడి

అగ్నిహోత్రపు సూర్యనారాయణ

గారి, 



స్వకీయ, 

ఆనంద బాల సరస్వతీ ముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రకటింపబడియె.

విశాఖపట్టణము.

1917.

ఓమ్. పరదేవతాయై నమః.

# శ్రీపోలమాంబాస్తోత్రదండకము.

గీ॥ శ్రీమదఖిల భక్త వ్రజ కామదాంబ
సైకత సితంబ, ముఖజిత చంద్రబింబ
సుగుణ నికురుంబ, పోషిత సురకదంబ
పోత్రిష్ఠ కరుణావలంబ, శ్రీపోలమాంబ॥

శ్రీమత్సమస్తామరవ్రాత సంస్తుత్య చారిత్ర, శృంగారగాత్రి, సదాస్తోత్రపాత్రి, స్ఫురద్దంబు జాతోపమస్తుత్యనేత్రి, శుభాకారి, బ్రహ్మాండ భాండోదరీ, భక్త భద్రంకరీ, సత్కృపాసాగరీ, శ్రీకరీ, ఈశ్వరీ, రాజరాజేశ్వరీ, సర్వభూతేశ్వరీ, దుర్గ, మాహేశ్వరీ, యర్ధనారీశ్వరీ, [illegible] నతేంద్రాణి, శర్వాణి, దాక్షాయణీ, బర్హిభరవ్రాతవేణీ; మహాఘోర దారిద్ర్య సంహారిణీ, మంజు[illegible]భాషిణీ, యోగమార్గణ్యసంచారిణీ; కీరవాణీ, మృడాణీ, భవానీ, పురాణీ, పృథుశ్రోణి! గీర్వాణి, సారక్షితాబ్జోద్భవాద్యామరశ్రేణి! కోట్యార్కసంకాశినీ, లోకసమ్మోహినీ, దైవచూడామణీ, నిత్యకళ్యాణి, దైతేయసంహారిణీ, భక్తహృత్పద్మ సమ్మోదసందాయినీ, పద్మరాగోజ్జ్వలద్దివ్య హారావళీ భూషిణీ, తార, డిండీర, మందార, కర్పూర, ముక్తావళీ

హారములో౯్యపమస్తుత్య సత్కీర్తి సంపత్సముహాన్వితే, గీపిశాలాన్వితే, రాజితానంత సంపద్యుతే, చాంపేయ పుష్పోపమస్నిగ్ధనాసాన్వితే, పూర్ణ కేందు బింబాస్య, బింబాధరీ, కంబుకంఠీ, యనూనాను రాగాన్వితే, నీలజీమూత రోమావళీరాజితే; ఫీన వక్షస్థలే, మత్త వేదండ తుండోరుభాగే సురాధ్యక్షు, పంచాస్యమధ్యా, శరజ్జ్యోత్స్నిమాచంద్రికా మందహాస ప్రభాభాసిత. పాణిపద్మద్వయా, యాదిశక్తి, మహాధీర గాంభీర్య సౌందర్యరూపోజ్జ్వలీ, భక్తి సంసక్త సద్భక్త సందోహ మోక్షప్రదాయీ, మహామాయి, శ్రీకారకర్ణద్వయీ, యంబ, కాత్యాయనీ, లోకమాతా బుధస్తుత్య సౌందర్య లతాంగీ, శ్రీకరీ, తోల్లిభూ మ్యగ్ని వాయ్వాదియౌ పంచభూతప్రపంచంబు, దధ్యేక్షురసాద్యాదియౌ సప్త పాథోధిసంఘంబు, సూర్యేందు, భౌమాబ్జజాది గ్రహంబుల్, సురానీకముల్, తారకల్, యక్షరక్షాప్సరశ్రేణియున్, మర్త్యులున్ లేక నిశ్శబ్దమై యుండు కాలంబునందీవు, సంపూర్ణ తేజంబుతో సర్వబ్రహ్మాండ భాండంబులన్ నిండిబల్ దండిగానుండి, స్వేచ్ఛాను కూలంబుగా, నీదుశక్తిప్రభావంబుచే సర్వమున్ సృష్టిగావింపనూహించి, యబ్జోద్భవబ్జాక్షు, నబ్జారిధారున్ జగంబులకు నీయంశచే ముందుగా నుద్భవంబొం

దగాఁజేసి, యవ్వారికిఁ, సర్వముఁ, సృష్టిగావింప,
కొంపొందగా, నాశసంబొందగాఁజేయు సంపూర్ణశక్తుల్
ప్రసాదించి యాధిక్యతఁనిల్ప, నాడాదిగావాంలీరేడు
లోకంబులఁ, జంతుజాలంబు సర్వంబునుస్ గల్గగా,
వెల్గగా, నిల్గగా, నీదుయాజ్ఞానుసారంబుగా జేయువా
రంచు పౌరాణికుల్ బల్కగా, వీనులన్ విందుగా విం
దు, నందీవు బృందారకేంద్రాద్రి గీర్వాణసందోహ
సంపూజితాంఘ్రిద్వయుఁ సచ్చిదానందు పంచాస్య,
ఖండేందుధారిఁ, విరూపాక్షు త్రైలోక సంరక్షదీక్షుఁ
భుజంగావళీహార భూషోజ్జ్వలుఁ సర్వభూతేశ్వరుండై
న మాహేశ్వరుఁగాంచి ప్రార్థించి, యాదేవదేవేశు
నర్ధాంగివై సర్వభోగంబులన్ బొందుచుఁ సంతతానం
ద సుస్వాంతవై, వానిచందంబువాదోడుగా నిల్చి దు
ష్టాసురవ్రాతముల్ జీల్చి చెండాడుచుఁ సర్వగీర్వాణ
సందోహ సంస్తోత్రచారిత్రవై, వారణాసీ ప్రయా
గాది పుణ్యప్రదేశంబు లంధ్రాంధ్ర, బంగాళ, నేపాళ,
పాంచాల, కాశ్మీర, సౌవీర, సౌరాష్ట్ర, కర్ణాట, లాటా, మ
రాటా, వరాటాది పుణ్యప్రదేశంబులఁ, దుర్గ, కామా
క్షి, మీనాక్షి, చండీ, విశాలాక్షి, శ్రీశైలవాసిని, బాస్న
పూర్ణాంబ, జ్ఞానాంబ, మూకాంబ, భూలోకమాతా,
మహాకాళి, బాలా, త్రిభువనేశ్వరి, శాంకరి, యోగేశ్వరి,

యోగాదిగాగల్గుబల్, వన్నెలఁ మిన్నయైవెల్గు నానావిధా భిఖ్యలఁ దాల్చి సంచారముఁ జేయుచుఁ, నిన్ను నత్యం తసద్భక్తితో సంతతం బాత్మ సంస్తుత్యముఁ జేయుస ద్భక్త సంఘంబు నత్యంత కారుణ్య దృష్టిఁ విలోకించి, యాయుష్య, మారోగ్య, మైశ్వర్యముఁ, పుత్రులఁ, మిత్రులఁ, భృత్యులున్, స్యందనచ్ఛత్రముల్, సుందరారామముల్, అశ్వసింధేభముల్ పూజ్యసామ్రాజ్య ముల్ కల్గి సంపూర్ణవిఖ్యాతిచే వెల్గగా జేసి సత్కీర్తి భూ మండలంబెల్ల వ్యాపింపగా జేయుచుఁ. భూతలంబం దు సత్య, క్షమా, శాంతి, కారుణ్య, సంయుక్త సద్భక్త పర్యాశ్రమంబై, సదాభాసురంబై, బుధానీక సారక్షి తా కల్పభూజంబులై దానధాధేయులఁ, పూర్ణ విఖ్యాతిచే వెల్గు శ్రీపూష వాత్స్యాన్వయోద్భూత శ్రీవిజ యరామావనీనాథ సామ్రాజ్య ప్రతిష్ఠితంబైన, శ్రీవిజయన గరీంద్ర పట్నంబునున్ దాపుగానుండి శ్రీలక్ష్మికిఁగా పురంబై, పసందౌ, వంసతన్న గ్రామమంబునఁ బా ములఁ బొందు సద్భక్తులన్ నీదు కారుణ్యదృష్టిఁ విలో కించి కాపాడగా, నాత్మలో నూహగావించి, మేల్మించి రంగారు, బంగారు, జల్తార్ బుటేదారు కాశ్మీరపుఁ పట్టుపుట్టంబు శృంగారమౌ కంచుకంబొందు చెల్వంబు గాదాల్చి, ఇందిందిర వ్రాతముఁ గ్రిందుగా జేయగా

జాలి బల్ పన్నగానున్న ఠీన్నారియా పెన్నెరుల్ ను
న్నగాదువ్వి, చెన్నారుకొప్పుంద మింపొందగా బెట్టి,
యాకొప్పుపైనొప్పగా, గొప్పచామంతి, చాంపేయ
మందార, కుందాది పుష్పంబులున్, రాగిడీచంద్రవం
కల్ మహాతేజపుంజంబులన్ జిమ్ముచుండంగ, బాలేం
దుబింబంబొకొల్లియుంచు సంస్తుత్యముల్ జేయగా జాలు
ఫాలప్రదేశంబునన్ దాండవింపంగ, రత్నాల చేర్పు
కల్ యుల్ చిన్నకస్తూరి తిలకంబు జెన్నారగా, మీర
గా, కన్నులన్ గాటుకన్ దిద్ది, శ్రీకారతేజంబులన్ గాం
చి చీకొట్టగా జాలు, కర్ణంబులన్ పళ్ళుగుల్కంగ నీలం
పు తాళ్లిళునన్ గర్ణపుష్పంబులన్ అందమింపొందగా
నుంచి, చాంపేయపుష్పంబునన్ గేరుతీరైననాసన్ మ
హారత్నసంతానమున్నింపు నత్తింపుసొంపారగా, నాణె
ముత్యంబుతో చంద్రకాంతోజ్జ్వలంబౌ బులాకీ కళ
ల్ మోమునన్ జేరుచున్ వెన్నెలన్ గాయ, కంఠప్రదే
శంబునన్ జిల్కతాళీ, స్ఫురద్రత్నహారంబులున్ చం
ద్రహారంబులున్ మోహరీ పేరులున్నుంచి, యాబాహు
లన్ బాజబందుల్ మరిన్ దండకడ్యాలు వంకీలు, హ
స్తంబులన్ పొంకమౌ కంకణాల్ ముద్దులున్ తళ్కు
గాజుల్ ప్రకాశింపుచున్ ఘుల్లుఘుల్లంచు మోగ్రియం
గ, వేళ్ళందునన్ యుంగరాల్ దాల్చి పాదంబులన్

రత్నమంజీరముల్ పాపటాల్ నెత్తిశూల్ గొల్సు
లున్ జిత్రమైనట్టి పాంజేబులున్ బెట్టి, అబ్రంబుగా,
కన్నులన్ జూడగా, నున్నదో, లేదో, యంచెన్నగా
జాలి, యామిన్నునన్ జాలి, బల్ సన్ననై, మిన్ననై
యున్న నా కౌనునన్ ఘంటలొడ్డాణమున్ బెట్టి,
శ్రీగంధ, కాశ్మీర, కస్తూరి, జవ్వాజి సౌగంధద్రవ్యం
బుల్ మేన నిండారగా బూసి యూహాసనల్ దిక్కుల
న్ గుభిమ్మనింపంగ, దేదీప్యమానప్రభా భాసితంబైన
దేహంబుతో మత్తవేదండయానంబుతో, మందహా
సంబుతో, కోకిలారావముల్ గుల్క శ్రీపోలమాంబా
ఖ్యనే తెంచి సంచారమున్ సల్పునిన్ గాంచి, హర్షించి,
సద్బ్రాహ్మణుల్, భూపవర్యాగ్రగణ్యుల్, వైశ్యులున్, శూ
ద్రసంఘంబు మోదంబుతో నిన్ను బూజింపుచున్ రోగ
నిర్ముక్తులై, భక్తి సంతోషసంయుక్తులై, భోగభాగ్యంబు
లన్ గాంచు, నీనిర్మలంబైన సత్కీర్తి భూమండలంబెల్ల
వ్యాపింపగా జేయుచున్ భక్తితో, పసపు కుంకంబులు
న్, పత్రిపుష్పంబులున్, పండ్లు ఫలహారముల్, యిక్షు
ఖండంబులున్, కజ్జముల్, అర్శలప్పాలునొబ్బట్లు మేల్
చల్మిడి వడపప్పులున్ పాయసాన్నంబులున్, ఘూటికుం
భంబులున్ గండదీపంబులున్, మేషమహిషంబులున్,
కుక్కుటవ్రాతమున్, నానావిధానైవేద్యముల్, కా

ప్పి యర్పించి, తా మెల్లసద్బంధుమిత్రాళితో, నైక్యభా
వంబుతో, వేడుకఁ గూడి వేంచేసి బాజా భజంత్రీలు,
సొన్నాయి భ్యాండు స్వరానీక వాయిద్యముల్ వీనులకుఁ
విందుగా వింపనాడప్పు వాయిద్యముల్ ఢణ్ ఢణాలంచు
దిక్కాళి భేదింప మ్రోగింపగా, శంఖముల్ పెద్దభేరీలు
భాంకారముల్ గల్పుచుఁ సర్వబ్రహ్మాండ భాండంబుల
న్నిండి ఘూర్ణిల్లగా, వెన్నగాలంబులున్ నోటి తాళం
బులుఁ వేపబెత్తంబులుఁ దాల్చి బల్ చిత్రవై చిత్ర్యసు
స్యందనవ్రాతముఁ జేర్చి యర్పించి వింతైన వేషాలతో
వీకుతిర్వీథి మాహోత్సవంబొప్పముల్ గొప్పగా, మెప్పు
గా, జేయగా దూరదేశంబులందుండి వీక్షింప నేతెం
చు స్త్రీబాలవృద్ధుల్ గణింపంగ కోటానకోట్లుందు; రా
యుత్సవంబందు వీక్షింప నింకొక్క చిత్రంబు, చర్చింపఁబ
ల్కఁ దురూహ్యంబట్టిదానిఁ బ్రశంసింప నెంతేని మో
దంబు చేకూరు, నేమన్న నో దేవి యాయుత్సవంబందు వే
రొక్క శకటంబు పైనుండు సురుమాన్ను నానొప్పు పెఁ
దారువుఁ గాంచనామింటికిఁ, మంటికిన్ మర్త్యులుఁ
దేవసంఘంబు సంచారముఁ జేయ నూహించి, యేర్పా
టుగా నిడ్డమార్గంబిదో నేమొ, యంచెన్నగా, దిన్నగా,
మిన్నయై, మిన్ను నంటునద్దాని, యగ్రంబునన్ వ
న్నియల్ గుల్కుచుఁ శిల్పి నిర్మాణ చాతుర్య సంపత్స

మోహాన్వితంబై, యుడాల బాజుగా, డంబుగా, దారు
నిర్మాణితాశ్వంబు వెల్గొంను,నాదారుకాశ్వంబు పైనొ
క్కభక్తుండు పావాస్యనిష్ఠాగరిష్ఠుండుస్నానంబుగావిం
చి మేల్ చల్వదువ్వల్వల్ దాల్చి, రంగారు, బంగారు,
శృంగారమాభూషణాలంగముందెల్లెడల్ బెట్టి,ఫాలప్రదే
శంబునన్ జిన్నకాశ్మీరపున్ బొట్టుచెన్నారగాదిద్ది, శీర్షం
బుపై మేల్ జరిపాగినున్ చాకచక్యంబుగాజుట్టి, హస్తం
బునన్ దర్పణంబొండుహస్తంబునన్ ధాగధగ్యంబునౌ
ఖడ్గమున్ బట్టి, నిర్భీతచేతస్కుడై, దేవితుభ్యంనమో
స్తంచునీనామస స్తుత్యమున్ జేయుచున్ అంబరాశ్వం
బునందుండి సంచారమున్ జేయు,నద్దానినిన్ గాంచు మ
ర్త్యాళిగోవిస్మయోద్భ్రాంతి విభ్రాంత చేతస్కులైకొంద
రాత్మన్ నిదానించి, కళ్లెప్పలన్ వేయకన్ దప్పకన్ జూ
చి, యీయంబరంబందు సంచార్యమున్ సల్పునాతండు
శ్రీపోలమాంబోత్సవంబున్ గనన్ భక్తి విచ్చేయువేల్పేశు
డో యశ్వరత్నంబు యుచ్చైశ్రవాభిఖ్యమోయంచు వే
ల్పేశు డెన్నన్ సహస్రాక్షుడీతండుఅక్షిద్వయుండల్లయిం
ద్రాశ్వమున్నంగ ధావళ్యమైయుండు నీయశ్వమీక్షిం
పబల్ రంగులన్నొండె, నీయంశముల్ చూడనాతండు వే
ల్పేశుడున్ గాడు,ఆయశ్వముచ్చైశ్రవాభిఖ్యయున్ గా
దు.యీతండునిక్కంపు మర్త్యుండెకానోపుమర్త్యుండె

# ప్రకటన

---

శుద్ధప్రతి!! అతిచౌక!!!

శుద్ధప్రతి!! అతిచౌక!!!

# శ్రీమదాంధ్రమహాభారతము

ఆదిపంచకము—పద్యకావ్యము.

రాయల్ సైజు 944 పేజీలుగల ఆదిపంచకము
ఇందు ఆదిపర్వ-సభాపర్వ-ఆరణ్యపర్వ-విరాటపర్వ-
ఉద్యోగపర్వములు ఇమిడియుండును 8941 పద్యములతో
ప్రకాశించుచున్నది. వెల 1-0-0

# కృష్ణలీలా డ్రామా

మిగుల రసవంతమైనది.

విక్రయమునకు సిద్ధముగానున్నది. వెల 0-8-0

అగ్నిహోత్రపు సూర్యనారాయణ, ప్రొప్రయిటర్,
ఆనంద బాల సరస్వతీ ముద్రాక్షరశాల,
విశాఖపట్టణము.

